## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్చైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్చైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com
సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement
సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020050015956

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్థం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

**http://www.new.dli.ernet.in**

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

**Subject**

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

**Language**

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

శ్రీ శివరామప్రసాద్‌గ్రంథాలయప్రచురణము ౧

# నవ్యకథానిధి

ఉభయభాషాప్రవీణ
అయినంపూఁడి గురునాథరావు

ప్రకాశకులు:
శ్రీ శివరామప్రసాద్‌గ్రంథాలయము
(రిజిష్టర్డు)
పెడసనగల్లు, (కృష్ణా)

# భూమిక



ఉభయభాషాప్రవీణ, అయినంపూడి గురునాథరావుగారి "నవ్యకథానిధి" అను గ్రంథము చదివితిని. ఈ గ్రంథము వ్రాయు నుద్దేశ్యము పవిత్రముగుటయే కాక గ్రంథరచనయందు వారు చేసిన ప్రయత్నము కూడ రమ్యముగా నున్నది. ప్రతివానికిని కొన్ని కొన్ని యాదర్శము లుండును. కొందఱి యాదర్శములు తాము స్వయముగా నాలోచించి నిర్మించుకొన్నవి కాక పరాభిప్రాయానుకరణవిషయములుగా నుండును. అట్టి యాదర్శము లాచరింపబడినపుడు మనఃక్రియలకు మిక్కిలి సంబంధములేక ఫలవైపరీత్యము ఘటించును. ఆదర్శములు పురుషుని జీవితవ్యవస్థ ననుసరించి, అతఁడు చను జీవితమార్గము ననుసరించి భిన్నస్థానీయములై యుండును.

ఒక న్యాయవాదవృత్తి నవలంబించువానికి తనవృత్తి నడపుకొనుటలో వాదనచేయుటలో న్యాయమును నిర్ధారణచేయుటలో వాని యాదర్శములు న్యాయశాస్త్రవిషయములై యుండవచ్చును. అట్లే రాజకీయరంగములో పనిచేయువాని యాదర్శములు తాదృక్ప్రవృత్త్యనుకరణములుగా నుండును.

ఉపాధ్యాయుఁడు తాను సర్వంకషముగా పరులమీద నాధారపడి యుండియు తన యాదర్శములకు తన జీవితమునకు ప్రాధాన్యములేని సంఘమున నతఁడు జీవికకై పాటుబడుచు నతఁడుకూడ కొన్నియాదర్శములు వెలయించికొంచునే యుండును. అతనిదృష్టి యెంతవరకు భవిష్యజ్జాతిని విద్యావివేకవంతముగా చేయుట యెట్లా యనియే వెదకుచుండును. విశ్వవిద్యాలయము నడుపువారికన్న ప్రాథమికవిద్యార్థుల మనోహృదయములను సవరించువారి ప్రయత్నములు కష్టములు నెక్కువైనవిగా కనబడుచున్నవి.

ఇతరదేశములయందు ప్రాథమికవిద్యను గూర్చియే యెక్కువ శ్రమ వహింతురని వినికిడి. మనదేశమం దట్టిశ్రమ కనుపించుటలేదు. ఈ ప్రాథమికవిద్య పదిమందిచేతులలోని బిడ్డవలె ఎత్తులమారి బిడ్డయయి త్రాగిన పాలుకూడ అరుగుటకు వీలులేక నురుసుగా క్రక్కుచున్నది. దీనికి ప్రతివాడును నియంత.

కాలక్రమేణ మార్పులు పరవిషయములు పురస్కరించుకొని ప్రతి విషయమున సంభవించుచునే యుండును. ఉత్తములు పరవిషయజాలము కర్తవ్యవిషయమునందు ముద్రపడనీయక దానిని ప్రత్యేకముగా నుంచి సంరక్షించుటకు ప్రయత్నింతురు. అట్టి ప్రయత్నముకూడ నేడు జరుగుచుండుట లేదనుట లేదు. కాని ప్రాథమిక విద్యేతరపరిస్థితులయందు ప్రాథమికవిద్యయందు ప్రత్యేకదృష్టి వెలయించుటకు వీలులేనంత దట్టపుతన మేర్పడి ఇది దానిమీద నాధారపడియుండుట హేతువుగా కొన్ని అపరిహారణీయములైన దోషము లాపాదిల్లుచున్నట్లు తోచుచున్నది. అప్పుడు ప్రాథమిక విద్యావిషయికమైన శ్రద్ధ బహుహస్తగతమై యేకనిర్ణయమునకు వచ్చుటలేదు. వైచిత్ర్యముగ చేయబడిన యొక యుత్తమప్రయత్నము నిరాకృతమును, అన్యతః కల్పితమైన యొకానొక యధమప్రయత్నము పురస్కృతము అగుచుండుట తప్పదు.

రెమ్మయై వంగక కొమ్మయై వంగదు. దేశభక్తి, సద్గుణాపాదనము బాలుని మనస్సునందు పసినాడే నాటుకొనవలయును. నీతులు పాఠశాలలో పాఠములకొఱకే చదవబడి వానియాచరణప్రాధాన్యము తగ్గినపుడు బాలురు పెద్దవాండ్రైకూడ చిన్ననాటి యవివేకమునే వెలయింతురు. పాఠములందు నీతులుచెప్పుట, చెప్పినవాని నాచరణలో పెట్టునంత గాఢముగా ప్రవర్తింపచేయుట ముఖ్యముగా రెండు పరిస్థితులమీద నాధారపడియున్నది. ఒకటి ఉపాధ్యాయులశ్రద్ధయు, రెండు బాలకులు చదువుచున్న పాఠములు జీవవంతములై పిల్లవాని మనఃపద్మమును వికసింపజేయునట్లుగా నుండుట. మొదటిది బాహిరప్రయత్నము, రెండవది యాంతరప్రయత్నము. బాహిరవిషయములకన్న అంతరవిషయము లుత్కృష్టములు; ఫలాధికములు. అందు చేత పాఠ్యగ్రంథము లేరుకొనుట లోననే యీ ప్రయత్నముయొక్క పరమస్థితియున్నదని పెద్ద లెఱుగుదురు. పాఠ్యగ్రంథరచన పిల్లవాని హృదయాకర్షిగా తన్మనఉన్మీలన సహాయకారిగా నుండవలెను.

గురునాథరావుగారి గ్రంథమునందు నీవిషయమునకు ప్రాధాన్యమిచ్చినట్లు కన్పించుచున్నది. కొన్నిసమాసముల కూర్పు కొంతరచనాపద్ధతి పిల్లవాని పసినెత్తురు ఆవర్తమును పొంది వానిలో నిగూఢములైన

దివ్యశక్తులు ఉద్బోధింపబడునట్లు వ్రాయబడినదనుటకు సందేహము లేదు. అరచన ఉత్సాహజనకమైన శయ్యతో కూడియున్నది. దీనిపఠనమువలన బాలకులకు కొంత యుత్తేజనము తప్పక కలుగును.

మఱియొకవిషయమును నేను గుర్తించితిని. బాలురకు కఠినపదములు పనికిరావని మిగుల తేలికగా నుండవలయునని నేటి చాలమంది ఆంధ్రోపాధ్యాయుల యూహగా కనిపించినది. గురువు చెప్పవలసినదిలేదు- బాలుడు నేర్చుకొనవలసినదిలేదు- అన్నట్టి చప్పనివ్రాతలతో బాలకునకు మనోవికాసము కలుగదు. శరీరమును మనస్సును వ్యాయామాపేక్షులు. వ్యాయామముకొలది వానికి పుష్టి చేకూరును. బరువుమోయించుట వ్యాయామముక్రింద లెక్కకాదు. సర్వావయవములకు శక్తి సమకూడు సాధనములు చేయవలయును. మనస్సు పరిపక్వమగుటకు బాలుని మనస్సు కొంచెము కష్టపెట్టవలెను. పాఠము లెక్కువచేసి వాడెఱుగవలసిన విషయముల నెక్కువచేసి వానిమనస్సుచేత బరువుమోయించరాదు. ఒకటి రెండు గ్రంథములలోనే వానికి కొన్ని క్రొత్తశబ్దములు చెప్పి క్రొత్తవిషయములు చెప్పి వానిమనస్సు వికాసింపచేయవలెను. వాక్యరచనావిన్యాసము శక్తిమంతమై బోధకమై ఉద్బోధకమై యుండునట్లు రచియింపబడిన గ్రంథములే వాని కట్టిలాభమును సమకూర్చును. ఒకానొక వాక్యనిర్మాణపద్ధతి పాఠకుని నెత్తురుడికించును. వానిమనస్సు నూహాత్మకముగా చేయును. అట్టి వానిని వాడు పసివాడు గ్రహించలేడని పెడద్రోయుటకన్న వానిమనస్సునకు యథాశక్తిగా సంస్కారము సమకూర్చునన్న యుద్దేశ్యముతో వానిచే నవి పఠింపజేయుట మంచిది.

పొడుపుకథలు మొదలైనవి క్లిష్టములయ్యును వాని మనస్సునకు ఉన్మీలనము కలిగించును. ఇది కష్టము, వాని మనస్సు గ్రహించలేదని యెంతవరకు వానిమనస్సును వానినుండి తొలగింతుమో అంతవరకు వాని మనస్సు పసితనమే వెళ్లగ్రక్కును. ఇది జడులైన బాలకుల కెల్లన్నను తెలివితేటలు కలవానిమనస్సును వామనము చేయును. ఇట్టిదోషములు ప్రస్తుత కావ్యపఠనమువలన పరిహృతములగునని నా యూహ.

పసిపిల్లల పుస్తకములలో అరసున్నల శకటరేఫల ప్రకృతివికృతుల సంశయగ్రస్తశబ్దరూపనిర్ణయముల తగాదాలు బలిసినవి. ఇవి పెద్దవా

డై నతర్వాత నేర్పవలసినవి. 'తాఁకు' ఈశబ్దములో నరసున్న యున్నదో లేదో పిల్లవాని కేల పట్టించవలయును? అర్ధానుస్వారయుక్తమైన యీశబ్దమును చూచి వానిమనస్సులో బీజరూపముగ ఈ శబ్దస్వరూపము నిలుచునను భ్రాంతి తద్భిన్నఫలప్రాప్త్యనంతరముకూడ తొలఁగ లేదనిన ఆభ్రాంతి భ్రాంతియే. పిల్లవానికి ప్రథమమున నేర్పవలసినది భాషాస్వభావము బహుశబ్దములు కాని తద్గ్రంథాధికవ్యాకరణవిషయములు కావు. ఈ రెండు పనులయందు శ్రద్ధ అర్థవిషయిక భాషావిషయికములైన ప్రధానవిషయములం దశ్రద్ధయు నేఁడు గోచరించుచున్నవి. దీఁకి బహ్వాచార్యకమైన పరిస్థితులు హేతువులు. పెద్దలు విషయమును కొంచెము శ్రద్ధతో పరిశీలించి పాటుపడవలసియున్నది.

ఎంతకష్టపడి ప్రాథమికవిద్య తీర్చినను ఆంధ్రభాషాజ్ఞానము దేశమున మిక్కిలి కొఱఁతపడియుండుట కనబడుచున్నది. దీనిని విచారించి యెట్టిగ్రంథములు బాలకులు చదివినచో ఈదోషములు పరిహృతములగునో అట్టి గ్రంథములు చదివించవలయునుగదా! నేడు పాఠ్యము లగుచున్న గ్రంథములు అల్పఫలప్రదములుగా కనిపించుచునే యున్నవి.

గురునాథరావుగారి గ్రంథము ఇష్టప్రాప్తి కల్గుట కున్ముఖముగా నడచుచున్నదనుట యొకసారి పఠించినచో పెద్దలకు తెలియకపోదు. వీ రేరికొన్న కథలలో బాలునిమనస్సు నాకర్షించి రుచిమంతమైన చక్కని బాటలో పెట్టగలిగిన ప్రణాళిక యొకటి గలదు. కల్పితగాథల పొంతఁకు బోక చరిత్రాత్మకములైన విషయములే సంగ్రహించికొనుట యొక విశేషము. దీనియందలిశయ్యా యొకపద్ధతిది. ఉత్సాహజనకమైనది. అది కొంత మేలు తప్పక చేయగలదు.

విశ్వనాథ సత్యనారాయణ, ఎమ్. ఏ.

# మనవి



'నవ్యకథానిధి' యను నీ చిన్ని పుస్తకమును ఆంధ్రవిద్యార్థిలోకమున కర్పించు సౌభాగ్యము నేఁడు లభించినందుకు మేము మిగుల సంతసించు చున్నాము. తెలుఁగు దేశములో బాలురయుపయోగార్థమై వెలువడు పాఠ్య గ్రంథము లిప్పటికే సంఖ్యాతీతములగనున్నను బాలుర మనస్సును ఒక యున్నతప్రవృత్తియందు ప్రవేశపెట్టగల యత్నము విరళముగామాత్రము గోచరించుచున్నది. కావున తన్మార్గమున ఎంతయైన నుద్యమించుట కవకాశము గలదని యెంచి మా గ్రంథాలయపక్షమున తొలి ప్రసూనముగ మేమీ గ్రంథమును వెలువరించియున్నాము.

ఏతత్‌గ్రంథరచయితలైన అయినంపూడి గురునాథరావుగారు ప్రాథమిక విద్యాలయముల యందు చిరకాలానుభవముగల బోధకులు. "ప్రాథమిక పాఠశాల" యను విద్యాపత్రికకు ప్రధానసంపాదకులు. కావున విజ్ఞులైన యుపాధ్యాయు లనేకుల యభిరుచులను అనుభవములను చవిచూచినవారు. ఇట్టి వీరు రచించిన యీ గ్రంథము ఆంధ్రవిద్యార్థుల విద్యావికాసమునకును మనస్సంస్కృతికిని తప్పక హేతుభూతము కాగల దని మానమ్మిక.

పవిత్రాశయముతో ప్రజాసంస్థయైన మా గ్రంథాలయము తలపెట్టిన యీ యుద్యమమును విద్యాశాఖాధికారులును అన్యవిద్యాభిమానులును సముచితరీతిని ఆదరించెదరని విశ్వసించుచున్నాము.

మా యభీప్సితమున కనుగుణముగా మాకీ పుస్తకము రచించి యిచ్చిన శ్రీ గురునాథరావుగారికిని పుస్తకమును సాంతముగా పరిశీలించి పీఠిక వ్రాసియిచ్చిన శ్రీ విశ్వనాథ సత్యనారాయణ, ఎమ్. ఏ. గారికిని మా మనఃపూర్వకమైన యభివందనములు.

పెదసనగల్లు,<br>
8—12—36.

ఇట్లు,<br>
ప్రకాశకులు.



# విషయసూచిక



వ పుట చూడుము. )



శివాజీ తనసైనికులు చెఱబెట్టితెచ్చిన మహామ్మదీయవనితను గన్నకుమాత్రివలె
న్మానించి “ మాతల్లికి నీసౌందర్యమున్నయెడల నెంతబాగుండెడిది ! నే నెంత
దృష్టవంతుఁడనై యుండెడివాడను !! ఎంత సౌందర్యవంతుఁడ నయ్యెడివాఁడను!!”
ి క్షమాపూర్వకముగ నాకాంతను గానుకలిచ్చి అమెభర్తకడ కంపివేసెను.

# భగవన్మహిమ

* *
*

బాలకా! భగవానుఁడు నాటిన ప్రకృతివాటికలో విహరించుటకై యొకమారు నాతో నేతెంచెదవా! అది నీలిమాకాశము. దానికి సోయగమును గూర్చు సహస్రకిరణుఁడాతఁడు. తన చల్లని వెలుఁగుచే జగమును ఆనందింపఁజేయు అమృతమరీచిని, అతనికి నలువైపుల విరజిమ్మిన ముత్యాల వితతివలె నున్న నక్షత్రములను ఎఱుంగుదువుగదా! అవి మేఘపఙ్క్తులు. వానినడుమ దాఁగురుమూఁతల నాడుకొనుచున్నయవి విద్యుల్లతలు. అదిగో రత్నకాంతుల నీనుచున్న ఇంద్రధనుస్సు.

ఇఁక నీ దృష్టి నొకింత యిటు మరలింపుము. నభోమండలముతో ఎకసక్కెము లాడుచున్న పర్వతములను నేత్రపర్వముగఁ గాంచుము. ఆ పర్వతములనొరసి జలజల ప్రవ

47 వ పుట చూడుము. )



శివాజీ తనసైనికులు చెఱబెట్టి తెచ్చిన మహమ్మదీయవనితను గన్నకుమార్తెవలె సన్మానించి “ మాతల్లికి నీసౌందర్యమున్నయెడల నెంతబాగుండెడిది ! నే నెంత యదృష్టవంతుఁడనై యుండెడివాడను !! ఎంత సౌందర్యవంతుఁడ నయ్యెడివాఁడను!!” అని క్షమాపూర్వకముగ నాకాంతను గానుకలిచ్చి ఆమెభర్తకడ కంపివేసెను.

# భగవన్మహిమ

* *
*

బాలకా! భగవానుఁడు నాటిన ప్రకృతివాటికలో విహరించుటకై యొకమారు నాతో నేతెంచెదవా! అది నీలి మాకాశము. దానికి సోయగమును గూర్పు సహస్రకిరణుఁ డాతఁడు. తన చల్లని వెలుఁగుచే జగమును ఆనందింపఁజేయు అమృతమరీచిని, అతనికి నలువైపుల విరజిమ్మిన ముత్యాల వితతివలె నున్న నక్షత్రములను ఎఱుంగుదువుగదా! అవి మేఘపఙ్క్తులు. వానినడుమ దాఁగురుమూఁతల నాడుకొను చున్నయవి విద్యుల్లతలు. అదిగో రత్నకాంతుల నీనుచున్న ఇంద్రధనుస్సు.

ఇఁక నీ దృష్టి నొకింత యిటు మరలింపుము. నభో మండలముతో ఎకసక్కెము లాడుచున్న పర్వతములను నేత్రపర్వముగఁ గాంచుము. ఆ పర్వతములనొరసి జలజల ప్రవ

హించు సెలయేళ్ల యొయ్యారపునడకలు నీ కనులకు విం దొనగూర్చ ననుకొందును. భయంకరమైనను మనోహరమైన విశాలవారాశినిఁ జూడుము. ఫలసుమభరితములైన వృక్షములు నీకు సంతోషమును గల్గించుటలేదా! వినువీథిని ఎగయుచున్న పక్షుల కలకూజితములు నీవీనుల కెట్లుతోఁచుచున్నవి? చిత్రవిచిత్రములై లెక్కింప నలవికాని జీవవర్గములను బరికింపుము. కాని వీనియన్నింటికంటె మనోహరమైన నీయాకృతినిఁ జూచికొనుట మాత్రము మఱవవలదుసుమా!

ఇంతటి చక్కనిసృష్టి చేసిన యాతఁ డెంతచతురుఁడో! నీ కనుపాపలయందు ఈ విశాల ప్రకృతియొక్క సౌందర్యరేఖలు ప్రతిఫలింపఁజేసిన యాతనిధీశక్తి యెట్టిదో!

ఆతఁడు ప్రకృతిలోని ప్రతివస్తువు నీ కెట్లు నీతిపాఠము గఱపునట్లు రచించెనో గమనింపుము. "వేళకు మేల్కాంచి నీపనిలో నీవు నిమగ్నుఁడవు కావలయు" నని తరుణభాస్కరుఁడు నీకు హెచ్చరికలఁ జేయుచున్నాఁడు. వికసించినపుష్పములు నీకు మందహాసము నేర్పుచున్నవి. ఝుంకారము సేయు భ్రమరములు నిన్ను సంగీతాభ్యాసమునకుఁ బురికొల్పుచున్నవి. ఫలభారముచే వంగినతరుశాఖలు నీకు విధేయతను గఱపుచున్నవి. నీరక్షీరములు నీకు ఎనలేని మిత్రభావమును బోధించుచున్నవి. తాకినయంతనే నీచేతికిఁ దనయొఱపును సంక్రమింపఁజేసెడి

గోరంట నీకు త్యాగమునుగూర్చినహితవు నొసంగుచున్నది. ఆకు రాలుకాలమం దుండెడి భూరుహములు "ఆపదలందు ధైర్యము వహింపు" మని యెఱింగించుచున్నవి. మనల నందఱ మోయుచున్న ధరణీతలము పవిత్రమైన సేవాధర్మమును బ్రదర్శించుచున్నది. తీవ్రగామి యగు సెలయేఱు "నీజీవిత పథమందు ఎల్లప్పుడు ముం దంజవేయు" మని నిన్ను ఉత్సాహ పెట్టుచున్నది.

విశ్వశిల్పి యగు ఆ భగవానునిలీలలు ఎన్నని వర్ణింపఁ గలము! ఏలిక యగు నాతనిప్రేమామృతమునకై విశ్వ మంతయుఁ దహతహపడుచున్నది. నిన్ను సర్వోత్తముఁడవైన మానవునిగా సృజించి నీకై యీచరాచరప్రపంచ మంతయు నేర్పరించిన ఆ కరుణామయునకు అనుదినము భక్తితో జోహారుల నర్పింపుము. నీకోరిక లన్నియు ఫలింపఁగలవు. నీజన్మము సార్థకము కాఁగలదు.



# జోన్ ఆఫ్ ఆర్కు

* *
*

కొలఁదిశతాబ్దములనాఁటిమాట. ఆంగ్లేయులు ఫ్రాంసు దేశముపై దాడివెట్టి క్రమముగఁ గబళింపఁ జొచ్చిరి. పరాసు వారి బలపౌరుషములు వారియెదుట నిరుపయోగములైనవి. వత్సరములకొలఁది ఆంగ్లేయులవిజయపతాకము చాల నిరాతంకముగా నెగురసాగెను. వారి నెదిరించఁగల పురుషసింహము పరాసువారిలో నొక్కఁడైనఁ బొడసూపియుండలేదు. ఫ్రాంసు దేశము పరాధీనము కానుండెను.

అట్టిసమయమున దైవ మొక యుజ్జ్వలశక్తిని ఫ్రెంచి వారికిఁ బ్రసాదించెను. ఆశక్తియే జోన్ ఆఫ్ ఆర్కు. అగుట కబలయే- పుట్టినది వెట్టిగొల్లకులముననే- అయిననేమి? ప్రతాపమునం దామె యీడులేని తేజస్విని. ఆంగ్లేయులవిజయక్రీడలు ఆమెకు హృదయశల్యములైనవి. స్వాతంత్ర్యజ్వాలలు ఆమె

హృదయమును జుట్టుముట్టినవి. నాఁటి కామె పదునెనిమిది వత్సరములు నిండిన పడుచుకన్నియ. ఈశ్వరప్రేరణచే ఆమె యొకనాఁడు ఫ్రెంచిరాజు ఛార్లసుకడ కేగి సమరవిహార మునకు అనుజ్ఞవేడెను. తొలుత నాతఁడు పరిహాసించెను. కాని యామె మరలమరల నొక్కుటచే నతఁ డంగీకరించి యొక సైనికదళ మిచ్చెను.

కట్టయే కాని కత్తిఁబట్టి యెఱుఁగని గొల్లకన్నియ నాయకురాలు- పరాజయములనేఁ బితికివాఱినపరాసుసైనికు లామెయనుచరులు- విజయపరంపరచే గర్వించియున్న ఆంగ్ల సైన్యముతో నెదుర్కొలు- ఎట్టివిచిత్రసంవిధానము. కాని సంకల్పబలము అమోఘమునుమా! ఆమెకే విజయము కల్గినది. ఫ్రెంచివారి యుత్సాహము మిన్నుముట్టినది.

ఆమెపరాక్రమఫలితముగ రాజు మరలఁ బట్టాభిషిక్తుఁ డయ్యెను. పరాసులు ఆనందములో నోలలాడుచు మైమఱచిరి. కాని ఆంగ్లేయులుమాత్రము ప్రతీకారమునకై తహతహపడు చుండిరి. అది యానందముచే ఉన్మత్తులైయున్న పరాసుల కెట్లు గోచరింపఁగలదు? ఆర్కుకన్యమాత్ర మది యొకకంటఁ గాంచుచునే యుండెను. చెవి నిల్లు కట్టుకొని యామె యెంత పోరినను ఆమెమాటలు వారియున్మత్తతను దొలఁగింపలేకపో యెను. అందుచే నామెయే స్వతంత్రముగఁ గార్యరంగమున

దుమికి యాంగ్లేయులతోఁ దలపడినది. కాని యభాగ్యవశమున ఆమె యాంగ్లేయులచేఁజిక్కెను. తమపరాజయములకుఁ గారణమైన యామెను వారు మాంత్రికురా లని నిర్ణయించిరి.

తాము నల్లే యెంచెద మని వాగ్దానముచేసి ఫ్రెంచివా రామెను నాంగ్లేయులబారినుండి విడిపించిరి. కాని కృతజ్ఞతలేని పరాసులధికారులు విచారణచేసి ఆమెకు మరణదండన విధించిరి. నిష్కరుణముగా నామె కాల్చి చంపివేయఁబడినది.

పాఠకా! ఆపెయసమాన దేశాభిమానమున కిట్టివిపరీతఫలము ఘటిల్లునని నీ వూహింపఁగలిగితివా?. చరిత్రాకాశమున వెలుఁగొందుచున్న వీరతారకలలో ఆర్కుకన్య సాటిలేనిది. వీరసింహులు వెన్నుఁజూపినచోట విజయాక్షతలు చల్లిన వీరవనిత. ఓటువడిన పరాసుల గుండెదడఁ బోకార్చిన విక్రమాన్విత. అట్టి సుగుణరాశికి విధివశముచే నెట్టి దయనీయస్థితి సంభవించినది! బాలకా! నీ వా దృశ్యము నొకింత నీమానసమునఁ జిత్రించుకొనినపుడు నీ యొడలు కంపింపకుండునా? నీహృదయము దహించుకొనిపోకుండునా? మాతృదేశమునకై యాత్మార్పణ మొనర్చిన వీరుల కెల్లఁ దలమానికమైన యామెచరిత్రను నీహృదయఫలకముపై లిఖించుకొని యెల్లప్పుడు పఠించుచుండుము.

# పట్టుదల

* *
*

"రాబర్టుబ్రూస్" అను నొకరాజు గలఁడు. అతఁడే వేళ సింహాసన మధిష్ఠించెనో కాని నిరాతంకముగ రాజ్యభోగము లను అనుభవించి యెఱుఁగఁడు. ఎప్పటికప్పు డేశత్రురాజు తనపై దండెత్తివచ్చునో యనియే యతనిభీతి. అతనికొలువు కూటములో యుద్ధచర్చలకుఁ దక్క అన్యవిషయములకు అవ కాశము లేకుండెను. సంగ్రామ మతనికి నిత్యకృత్యమైనది. ఎత్తినకత్తి దింపని దినము లెన్నియో యతని జీవితమునఁ గలవు. ఒకప్పు డతఁడు ఏడుపర్యాయము లరిసైన్యములతోఁ దలపడి పోరునల్పెను. కాని దురదృష్టవశమున నేడుపర్యాయ ములును బరాజయమే పొందెను. తుదకతఁడు హతాశుఁడై రాజ్యము విడిచి యొకనాఁ డొక మహీరుహచ్ఛాయను విశ్ర మించియుండెను.

ఆసమయమున వృక్షముపైనున్న యొక సాలెపురు గతనిదృష్టిమార్గమునఁ బడెను. అది తనగూటినుండి క్రిందికి జారి తిరిగి పైకెక్క యత్నించుచున్నది. కాని నునుపైన యా దారముపై నాలూతకు ఊఁత జిక్కదయ్యె. అయినను విడువక యేడుమాఱులు ప్రయత్నించినది; వ్యర్థమైనది. కాని నిరుత్సాహము చెందలేదు. ఎనిమిదవసారి యత్నము సల్పినది. కృషి ఫలించినది. అది హాయిగాఁ దనగూటఁ బ్రవేశించినది.

బ్రూస్ చక్రవర్తి యీదృశ్యమంతయుఁ దదేకదృష్టితోఁ జూచెను. అతనికనులయెదుటనుండి యొకయవనిక తొలఁగినట్లయ్యెను. సహనమువహించి ప్రయత్నించినచో సాధ్యము కాని పని లేదని యతనికి దృఢవిశ్వాసము గల్గెను. ఆతని హృదయ మొక్కుమ్మడిగా నుత్సాహపరవశ మయ్యెను. అతఁడు తటాలున లేచి తిరిగి తనరాజ్యమునఁ బ్రవేశించి సైనికుల సమకూర్చుకొని మహోత్సాహముతో అరివర్గము నాక్రమించెను. విజయము గాంచెను.

బాలకా! విఘ్నములకు వెఱచి వితాకుపడుట వివేక లక్షణము కాదు. విఘ్నములే మానవుని విజయసౌధమునకుఁ గొంపోవు సోపాన పంక్తులు. నీ గమ్యస్థానమునకును నీకును మధ్య ఎన్నియంతరాయము లున్నను సరకుగొనవలదు. నీపట్టుదలను బరీక్షించుటకే భగవంతుఁడు కష్టపరంపరలను గల్పించు

చుండును. జంకక వాని నెమరొక్కంటివా క్షణములో నీకష్టము లన్నింటిని దుడిచివేయఁగలశుభసమయమువచ్చుట నిశ్చయము. గర్జారావముచే లోకము కంపింపఁజేయు పయోధరము వెనువెంటనే శీతలవారి నిచ్చుట యెఱుఁగవా! నిప్పులు గ్రక్కు గ్రీష్మాతపమును వెన్నాడి శీతలవాయువు వీచుటను గాంచవా!



# సోక్రటీసు

* *
*

ం*అను దేశము కలదు. ఒకప్పు డచట ననేక దురాచారములు ప్రబలియుండెను. మతము పేరిట ఎన్నో ఘోరకృత్యము లనుదినము జరుగుచుండెను. ఎవరైన వానిని అరికట్టఁ దలఁచినచో మతావేశపరులైన ప్రజలును ప్రభువులును గూడ అడ్డుతగిలెడివారు. అందుచే నాదుష్కృత్యములను సంస్కరించుటకై యెవ్వరును సాహసింపలేకపోయిరి.

కొంతకాలమునకు "సోక్రటీసు" అను మహాతత్త్వవేత్త యీకార్యమునకుఁ బూనుకొనెను. దేశములోనియువకు లందఱిని ప్రోగుచేసి వారికి తమదురాచారములను గూర్చియు వానిని జక్కఁబెట్టవలసిన యావశ్యకతను గూర్చియు బాగుగా నచ్చఁజెప్పెను. వా రందఱును సోక్రటీసుఅడుగుజాడలలో నడచుటకు నిశ్చయించుకొనిరి. సోక్రటీసు అచట యాచార

ముల నొకదానివెంట నొకటి సంస్కరింప మొదలుబెట్టెను. స్వార్థపరులైన కొందఱి కీపని కంటక మయ్యెను. వారు రాజును సమీపించి, "సోక్రటీసు మనమతమును విధ్వంసము చేయుచున్నాఁడు. మనసభ్యతను మంటఁగలుప నున్నాఁడు. చేసిన అనర్థము వాటిల్లుట నిశ్చయ"మని కొండెములు చెప్పిరి. రాజు విశ్వసించి సోక్రటీసును నిర్బంధించెను.

న్యాయాధిపతు లాతనిపై మోపఁబడిననేరము లన్నింటిని విచారించిరి. సోక్రటీసు 'తాను నిరపరాధి' నని వాదించెను. కాని రాజాజ్ఞకు వశ్యులైన యధికారులు చెవిఁబెట్టలేదు. విషపానముచేసి మరణించునట్లుల నాజ్ఞాపించిరి.

కారాగృహములో సోక్రటీసు ప్రశాంతముగఁ గూర్చుండియుండెను. అతనియెదుట విషపాత్రము ఉంచఁబడెను. ఒక మహాకార్యమునకై తనజీవితమును ధారవోయు నవకాశము లభించినందుకు అతనియాత్మ ఆనందముచేఁ దన్మయత్వము చెంది యుండెను. అతఁడు చిరునగవుతో ఆపాత్రియం దున్న విషమును ద్రావి ప్రాణములు బాసెను.

అహో! ఏమి త్యాగము! తన జాతిని సంస్కరించుటకై దృఢసంకల్పముతో ఆత్మార్పణమును గావించిన ధన్యజీవి యతఁడు. కావుననే ఆమహామహునిచరిత్ర మనకు స్మరింప యోగ్యమైనది.

విద్యార్థీ! నీ వాపురుషపుంగవుని దివ్యనామము ప్రతి దినము జపించుచుండుము. నీహృదయవాటికలో ఉత్తమ భావములు మొలకెత్తఁగలవు. ప్రకాశభాసురమైన యతని దివ్యమూర్తిని నీమనోనేత్రమున కెదుట నెల్లప్పుడు నిలిపి యుంచుకొనుము. నీ అజ్ఞానము నిన్ను దరిజేరకుండును.

లోకస్థితికి అట్టిమహాత్ములే కారకులు. గగనమునఁ దారకలవలె విశ్వమున అట్టివారే ప్రకాశించుచుందురు. కాన నీ వేది కర్తవ్యమని తలఁచెదవో దానిని నెరవేర్చుటయందు ఒకవేళ నీవు నశ్వరమైన యీశరీరము అర్పింపవలసివచ్చినను వెనుదీయవలదు. మరణభయము లేని కర్తవ్యాచరణముచే నీకు అమృతత్వము ఘటించును.



# సన్మైత్రి

* *
*

శ్రీవిద్యాసాగరునిపవిత్రనామమును నీవెప్పుడైన వింటివా! అతనిజీవిత మంతయు అగాధప్రేమను వెలార్చు అనేకగాథలతో నిండియున్నది. సాగరసామ్యము అతని కొక విద్యయందే కాక దానము, దాక్షిణ్యము మొదలగు సకలసద్గుణములయందును నొప్పఁగలదు. ఆతఁడు దేశహితమునకై రేయింబవలు ఉద్యమించిన కర్మవీరుఁడు. చెమటోడ్చి గడించిన దంతయుఁ జేఁజాచినవారికెల్ల సహర్షముగ నిచ్చిన వదాన్యశేఖరుఁడు. అంతటి మహోన్నతగుణములు కలవాఁడు గావుననే భారతావనిలో ఆయన కీమచ్చలేని యశస్సు.

అతఁడు కాళీఘట్టమునం దొక కళాశాలలోఁ గొంత కాలము ఆచార్యత్వము వహించి యుండెను. ఆసమయమున అచటనేయున్న మరొకకళాశాలలో రెట్టింపు జీతము లభింపఁ

గల యొకయుద్యోగము 'ఖాళీ' 'యయ్యెను. విద్యాసాగరుని విఖ్యాతపాండిత్య మెఱింగిన యాకళాశాలాధికారులు ఆపదవి యం దతనినే నియోగింపఁ దలఁచి యాతని కాసంగతి నెఱిగించిరి.

నూతనపదవియందు ఇనుమడివేతనము లభింపఁ గల దని బాగుగా నెఱిఁగియు అతఁడు సమ్మతింపక నిస్సహాయ స్థితియందున్న తన మిత్రుఁడగు తర్కవాచస్పతికి ఆపదవి నొసంగుఁడని వారిని వేడుకొనెను. విద్యాసాగరునిపైఁగల యభిమానముచే వా రాతనికోర్కను నెరవేర్చుట కంగీకరించిరి. అపు డాతఁడు మహానందభరితుఁడై కాల్నడకను దర్కవాచస్పతియింటి కేగి యాశుభసంవాదమును దెలిపెను.

విద్యాసాగరుని విశుద్ధప్రేమను గాంచి వాచస్పతి పరవశత్వమునంది యిట్లనెను· "సాగరా! నీవు మానవాకృతినున్న సాక్షాన్మాధవుఁడవుగాని కేవలమానవుఁడవు గావు.

ఔను! ఆమాటలోనిప్రతియక్షరమును సత్యసమ్మతము. స్వార్థపరత్వ మనునది యొకపెద్ద పిశాచము. దానికి వశులై యెంతటి నీచకార్యమునకైన వెనుదీయని మానవు లనేకులు గలరు· అట్టిస్థితిలోఁ దనకార్యమునైనఁ గాలఁదన్ని పదార్థమునకై పాటుబడు విద్యసాగరువంటి సజ్జనుల నేమనవలెను? నిశ్చయముగా నతఁడు మాధవుఁడేగాని మానవుఁడుగాఁడు. అట్టి స్వర్గీయ గుణమే మానవజన్మను సార్థకపఱచును.

# క్యాసబయాంకా

* *
*

నైలునదీప్రాంతమున ఆంగ్లేయులకును బరాసులకును ఒకప్పుడు ఘోరసంగరము తటస్థించెను. ఫ్రెంచిసేనాని యొకఁడు తన పదుమూఁడేఁడుల చిఱుతపాపని నొకయోడపై నిలుచుండఁబెట్టి "నాయానతి వచ్చువఱకు నీ విచ్చటనే కదలక నిలిచియుండు"మని యాజ్ఞాపించి తాను సమరసన్నాహమునఁ బ్రవేశించెను. కాని విధివశమున నతఁడు ఆహవరంగమున మృత్యువుచేఁ గబళింపఁబడెను.

సంగ్రామము అంతకంతకు భయంకరమయ్యెను. శతఘ్నులు కురిపించుచున్న యగ్నిజ్వాలలలో వేనకువేలు సైనికులు హతమగుచుండిరి. తుద కాభయంకరాగ్ని యాను కుమారబాలకుఁ డున్న యోడకుఁగూడ నంటుకొనెను. పాపమా బాలుఁడు తండ్రియాజ్ఞకై యెదురుచూచుచుండెను. తన జనకుఁడు విగతజీవుఁడైనసంగతి వానికి నెఱిఁగించువాఁ డొక

డైన లేకుండెను. ఓడ విడిచి యందున్న సైనికులందఱు పారి పోయిరి. కాని యా ముద్దుపాపఁడు నిశ్చలచిత్తముతో జనకుని యానతికై నిరీక్షించుచుండెను. అగ్నిజ్వాలలు తుద కాతనిఁ జుట్టుముట్టెను. అయినను నిర్భీకుఁడగు నాబాలుని హృదయము ఆవంతయైనఁ జలింపలేదు. వదనము పిఱికిచూపుల కేనుమాత్రము తావీయలేదు. అతఁడు "తండ్రీ! తండ్రీ! నా కానతిచ్చెదవా! నే నింకను నిలువవలయునా? నా కర్తవ్యము ముగియలేదా?" యని యెలుగెత్తి రెండుమూఁడు మారులు అఱచెను. కాని మృత్యుగర్భమున దాగియున్న తనతండ్రికర్ణములం దాతని కంఠారవ మెట్లు ప్రవేశింపఁ గలుగును?

తుట్టతుదకు హతాశుఁడై యా బాలకుఁ డాకయదు గైన మరల్పక తనయసువుల నుజ్జగించుటకే సంసిద్ధుఁడయ్యెను. ఎంతటి మనోనిగ్రహము! ముక్కుపచ్చలారని యా పసిపిల్ల వాఁడు మొక్కవోనిధైర్యమునఁ దన శరీరము నగ్నిదేవునకు సమర్పించెను.

అయిన నేమి? జరయును మృతియునులేని యతని పవిత్రాత్మ తనవెలుఁగుతళుకుల నీ విశ్వ మంతయు వెదఁజల్లుట లేదా? పాఠకా! అతని నామము క్యాసబయాంకా. పసితన ముననే పితాజ్ఞకై ప్రాణము లర్పించిన యా కసిగందు మనోదార్ఢ్యమను నీ వెన్నఁడు మఱవకుము.

# స్థైర్యము

* *

ఈశతాబ్దారంభమున జరిగినసంఘటన మిది. "పెరి క్లిస్" అను పేరుగల ఒకయోడ గలదు. స్కాటులండునివాసి యొకఁడ దానియధిపతి. ఒకనాఁ డది ఆస్ట్రేలియాతీరమునుండి బయలుదేరినది. బయలుదేరుసమయమున ఆకాశమునిర్మలమై యుండెను. వాయువు అనుకూలముగా వీచుచుండెను. సముద్రము వీచీక్షుభితముగాక ప్రశాంతమై యొప్పుచుండెను. కాని కొంతదూరము ప్రయాణము సల్పునరి కా పోతము సముద్రమునం దదృశ్యమై యున్న యొక కొండకుఁ దగిలి విచ్ఛిన్నము కాఁదొడగెను.

హఠాత్ సంభవమైన యీవిపత్తున కందున్నయాత్రికు లందఱు వెఱఁగంది యేమియును దోఁపక యిటునటుఁ బరువెత్త సాగిరి. నౌకాధిపతి యాసందడి విని "ఊరక యుత్తలపడిన

లాభమేమి? మన మిపుడు సేయఁదగినది కర్తవ్యాలోచన గాని యార్తాలాపము కాదు. మీసంరక్షణమునకై సకలయత్నములఁ గావించెదను. ధైర్యమును దూరీకరింపవలదు. ఉత్సాహమున కురిపెట్టవలదు." అని యుద్బోధించి విపత్సమయమున నుపయోగించుటకై ప్రత్యేకముగా నున్న నావల నాయత్తపఱపించెను.

యాత్రికు లొకరొకరే యానౌకలపై నెక్కి నిశ్శబ్దముగఁ గూర్చుండిరి. నావికు లుడుగని యుత్సాహముతో నావల నావలితీరమునకు నడపింపసాగిరి. ఓడనాయకుని యెడలేనియెచ్చరికలచే నావికులం దొకనవశక్తి జనించి వేయిచేతులతోఁ బనిచేయుచుండిరి. కన్నుకనుఁ బొడిచికొన్నను గానరాని గాఢాంధకారము. సమీపస్థమైన దీపగృహమున దైవసంయోగముచే మేల్కనియున్న తద్రక్షకు లాకోలాహలము విని దీపము వెలిఁగించిరి. నావికులశ్రమ ఫలించినది. నిరపాయముగ వారా నౌకలనన్నింటిని నొడ్డుకు చేర్చిరి. నౌకాధిపతియొక్క ధైర్యస్థైర్యములచే నాల్గువందలయేబదిమంది మృత్యుముఖము నుండి మరలింపఁబడిరి.

నడిసంద్రమునఁ దటస్థించిన యావిపత్తును ధైర్యముతో నెదుర్కొనక యెవరికివారు తత్తరపాటుతోఁ గాలహరణము చేసియుందు రనుకొనుడు? ఏమి జరిగియుండును?

# స్థైర్యము

బాలకా! మానవజీవితమం దిట్టివిషమసంఘటనము లెన్నో సంభవించుచుండును. అట్టిసమయములందే ధీరత వహించి కష్టనివారణమునకై శాంతముగ ఉద్యమింపవలెను. ఆపదలందు ధైర్యమును వీడితివా, నీవెందుకును గొఱమాలిన వాఁడ వగుదువు. కష్టములు నీపైఁ గాలుదువ్వినపుడు నిశ్చల మానసముతో నిర్భీకముగ నెదుర్కొనుము. కర్తవ్యమార్గము నుండి కాలు మరల్పక యుత్సాహముతో ముందంజవేయుము. శాంతవీరునకే సఫలత చేవాటులో నుండునని విశ్వసింపుము.



# రహీము

* *
*

రహీము అక్బరుచక్రవర్తి యొక్క మేనల్లుఁడు. అతనికి సంస్కృతభాషయందును పార్శీభాషయందును మొక్కవోని పాండిత్యము గలదు. అతఁడు కవులపాలిటి కల్పతరువు. దీనుల పాలిటి చింతామణి. అడుగుటయే తడవుగఁ జేతికివచ్చినదెల్ల నిచ్చివేయుట యతనిపరిపాటి. అతనికాలములో సహాయార్థ మతని సమీపించనివాఁడు లేఁడు. సమీపించి నిరాశుఁడైన వాఁడును లేఁడు.

అతఁ డక్బరుచక్రవర్తియమాత్యులలో నొకఁడు. బొక్కసమంతయు అతనికైవసమై యుండెను. కాని, మితిలేని యాతనివదాన్యతచే నతనిసొంతయాస్తియే కాదు, చక్రవర్తి ధనాగారముగూడ శూన్యమగుచుండెను. ఈవృత్తాంతము

అక్బరునకుఁ దెలిసెను. అతఁడు వెంటనే రహీముజాగీరు లన్నియు ఆక్రమించుకొని దేశమునుండి వెడలనంపెను.

ఇఁక రహీము నాశ్రయించుకొని యున్న యసంఖ్యాక దీనుల కెవ్వరు దిక్కు? ఆతనిదర్శనము లేమిచే వా రందరు వికలత నొంది యతనికొఱకై దేశదేశములు వెదకసాగిరి. తుదకొకచోట నామహాపురుషుఁడు మట్టితట్టల మోయుచు వారి దృష్టిపథమునఁ బడెను. ఆహా! కాలవిశేషము! మహాచక్రవర్తికి మేనల్లుఁడై మహీభారమువహించిన మంత్రిసత్తముఁడు మట్టితట్టలను మోయుచున్నాఁడు. లోకముచూపులో నతఁడు దరిద్రుఁడే. కాని లోకేశునిదృష్టిలో నతఁడే మహాధనికుఁడు.

ఆఁకటిత్రేగునఁ దనుఁజేరి విలపించుచున్న యా దరిద్రుల దీనాలాపము లాతనిహృదయమునఁ జిచ్చువెట్టినవి. వివశుఁడై యాతఁడు రాతివలె నిశ్చేష్టితుఁడయ్యెను. వేనకువేల నిచ్చుటకైన వెనుకాడనియాతనిచేతిలో నేఁ డొకగవ్వయైన లేదయ్యె. పాప మాతఁ డేమిచేయగలఁడు ?

తన హీనస్థితికై యంగలార్చుచు నిట్లనియెను. "అన్నలారా! నన్ను విడువుఁడు. ఈరహీ మారహీము కాఁడు. ఇతఁడు మాధుకరమెత్తియు మట్టితట్టల మోసికొనియు జీవించుచున్నాఁడు."

ఏమి కరుణాదృశ్యము!

దీనులకై దేశత్యాగముచేసి కడగండ్లపాలైన యాతని జాలిమనస్సున కెవరైన మదింపు వేయఁగలరా? మణిసౌధములను వదలి మట్టితట్టలఁ జేబట్టిన యాతఁడు సామాన్యుఁడా? ఉన్నవారికి వానికున్నయౌదార్యములో లేశమైన యున్న యెడల భూమిపై నీ యశాంతి యుండునా! ఈ యాక్రందన ముండునా?



# వినమ్రత

* *
*

ప్రకృతి జగన్నియంత రచించిన యొకమనోహర కావ్యము. యుగములకొలది పఠించినను లేశమైన తఱుగని మహాగ్రంథ మది. ఎంతటి సునిశితబుద్ధికైనను అందని యగాధ విషయము లం దెన్నో గలవు. ప్రకృతిరహస్యములను బరిశీలించుటయందు తమధిషణాశక్తి నంతయు వినియోగించి కృతకృత్యతనందిన పండితులు కొలదిమంది మాత్రమే కలరు. వారిలో న్యూటన్‌పండితుఁ డగ్రేసరుఁడు. ప్రకృతియందలి నిగూఢవిషయము లెన్నింటినో యాతఁడు పరామర్శించి తన యసాధారణధిశక్తిని లోకమునకు వెల్లడించెను.

వస్తుతతియందు ఆకర్షణశక్తి యెట్లున్నదో సూర్య చంద్రులు వారాశిని పోటుపాటుల నెట్లు కల్పించుచున్నారో సూర్యరశ్మిలో ఇంద్రధనువు వివిధవర్ణములయం దగపడు కిరణా

-చయ మేరీతి నెలకొనియున్నదో మొదలగు అనేక విషయ ములపై నాతఁడు పరిశోధన గావించి సఫలత నందెను. ప్రకృతి సాగరమును నీరీతిగ మథించిన యామహామహుని ప్రతిభకు ఆంగ్లేయులు గర్వించుచుందురు.

ఒకనాఁడొకయాంగ్లవనిత అతని సమీపించి యాతని వైదుష్యమును బ్రశంసింప మొదలుపెట్టెను. అపుడాతఁడు వినమ్రుఁడై యిట్లనెను. "విజ్ఞాన మొక బ్రహ్మాండమైన జల రాశి. నే నాజలరాశియొడ్డున గులకరాలను మాత్రి మేఱికొని యానందించు నొక పసిపిల్లవాఁడను."

ఆహా ! ఏమి యాతని వినయసంపత్తి ! ప్రకృతిశాస్త్ర మునం దతనికిఁ బై చేయి లేదని ప్రపంచమంతయు వాకొనుచుండ నాతఁడు తన్నొక పిల్లవానితో నుపమించుకొనుచున్నాఁడు.

పదనుగలప్రజ్ఞ. ప్రజ్ఞకుఁదగిన పాండితీపటిమ. పాండిత్య మునకు వన్నెపెట్టఁదగిన వినయసౌశీల్యము. విజ్ఞానవైభవమున పట్టమందిన యాతని కీసుగుణరాశి బంగారునకుఁ బరిమళమబ్బి నట్లయ్యెను. ఉండియు లేని యల్పజ్ఞానముచే గర్వించు దురభి మానులు ఆతని విధేయతగాంచిన లజ్జింపకతప్పదుగదా !

బాలకా ! వినయవివేకములతోఁ గూడిన విజ్ఞానమే రాణింపునకు రాఁగలదని తెలిసికొనుము. విద్యచేతను ధనము

చేతను నీవు మత్తిల్లుట సహజము. అప్పుడు నీదృష్టిని ఈవిశాల ప్రపంచముపై నొకసారి ప్రసరింపఁ జేసితివా నీకంటె నధికు లెందఱో మహాతేజముతో నీకనులకు మిఱుమిట్లు గొలుపు చుందురు. అపుడు నీ యహంకృతి యంతయు నోసరిల్లఁగలదు.



# హాతింతాయి

* *
*

" నీకంటె నధికుని ఉత్తమగుణసంపన్నుని నీవెన్నడేనిఁ జూచితివా" యని హాతింతాయిని ఒకనాఁ డతనిమిత్రు లడిగిరి. హాతింతాయి అరబ్బుదేశస్థుఁడు. మహాధనికుఁడు. కాని యతనికి వన్నెతెచ్చినది అతనియౌదార్యముకాని ధనము కాదు. ఉదారత కతఁడు ఉనికిపట్టు. వదాన్యత వానియింటికి వలచి వచ్చినది. దీనులసాయమునకే భగవానుఁడు తనయింట ధనమును గుదువపెట్టెనుగాని యితరుల ననుభవింపనీయక వ్యర్థముగా ముడిచిపెట్టుకొనుటకుఁ గాదని యతని యభిప్రాయము. కావుననే యత డర్థుల కెల్లప్పుడును గోర్కెలీరిచ్చుచుండెడివాఁడు.

తనమిత్రు లడిగినప్రశ్నకు హాతింతాయి మందహాసముతో "ఔను చూచితిని" అని బదులుచెప్పెను. ఉత్కంఠతో

"ఎవ్వఁ డాతఁడు? అతఁ డెట్టివాఁడు" అని వారు తిరిగి ప్రశ్నించిరి. హాతింతాయి యిట్లు సమాధాన మిచ్చెను. "నే నొక నాఁడు యజ్ఞపీఠమున నలువదియొంటెలను బలియిచ్చి యొక పెద్దవిందు చేసితిని. పిమ్మటఁ గొందఱు ప్రధానులు నన్ను వెంబడింపఁగా నే నొక యడవికి వెళ్లితిని. అచట నొకకట్టెలఁ గొట్టువాఁడు నా కగపడెను. అతఁడు పరుల నెవ్వరి నాశ్రయించి యెఱుఁగఁడు. కాయకష్టము చేసియే యతఁడు తన కుటుంబమును బోషించుకొనుచున్నాఁడు. "ఓయీ! హాతింతాయి నలుపుఁ విందునకై యనేకులు పోవుచుండఁగా నీవిచ్చట గట్టెలఁగొట్టనేల? విందారగించుటకై నీవేలఁ బోకుంటివి?" యని వానిని నేను బ్రశ్నించితిని. అపు డాతఁడు "అయ్యా! అతనివిందు నాకేల? నా కాలుసేతులు కదలుచున్నంతవరకు నా కితరుల యౌదార్యముతోఁ బనిలేదు. మిత్రులహస్తములు మిత్రుల కిడుఁగాక. ఉదారహస్తములు నిస్సంగులైన యతుల కిడుఁగాక. అంతియేకాని స్వావలంబియగువాఁడు పరాశ్రయమునకై యెన్నడును బ్రాకులాడఁడు.

పాఠకా! చూచితివా? యొకట్టెలవాని గంభీరవచన మధురిమ! అతనిమాటలయందు ఆత్మాభిమానము తొలుకాడుచున్నది. అతనిహృదయమందు స్వాతంత్ర్యప్రభలు ప్రకాశించుచున్నవి. అతనిముందఱ ముత్యాలరాశినుంచుము.

అతఁడు మురియఁడు. కాని తనమేనిపైఁ జిందెడి చెమట బిందువులఁ దిలకించి యుప్పొంగిపోఁగలఁడు. అతఁడే నిజముగ ధన్యజీవి. స్వేచ్ఛనుగోరు ప్రతివానికిని స్వావలంబనముకంటె ఉత్తమసాధనము లేదు. సచ్చరిత్రము నలవరచుకొనుటయందు మానవున కది ఎనలేని సామర్థ్యము ప్రసాదింపఁగలదు. క్షణ భంగురమైన జీవితమును అమృతమయ మొనరించుటకు అదియే పట్టుఁగొమ్మ. పరునియింట పంచభక్ష్యములఁ గుడుచుటకంటెఁ గష్టించి గంజియేని ద్రావి యభిమానము కాపాడుకొనుట యుత్తమ మని మఱవకుము.



# సంయమరాయలు

* *
*

పృథ్వీరాజు ఢిల్లీనేలిన ప్రతాపశాలి. అతఁడు ప్రజలను దన పతాకచ్ఛాయల సుఖింపఁజేసిన శూరశిఖామణి. మహోవారాజగు పరమాల్ అతనికి బద్ధశత్రువు. ఒకప్పు డతఁడు పృథ్వీరాజుపై దండెత్తివచ్చెను. ఇరుపక్షులును రణకోవిదులైన సైనికులచే నిండియుండెను. కదనకోలాహలము మిన్నుముట్టెను. యుద్ధము భయంకరముగా నుండెను. రణభూమిలో నెత్తురు తెట్టుకట్టినది. పీనుగులు గుట్టలు పడినవి. పృథ్వీరాజు శూరవరులైన తనసేనాపతుల నెందఱనో పోగొట్టుకొనెను. పోరిపోరి తుద కతఁడును మూర్ఛావశుఁడై నేలపై నొరిగెను.

అతని ప్రక్కనే సంయమరాయలు తొడలువిరిగి పడియుండెను. సంయమరాయలు పృథ్వీరాజుసర్దారులలోఁ బేరెన్నికఁ గన్నవాఁడు. పడియున్న యాతఁడు తన యేలిక దురవస్థను

గనులారఁజూచి సహింపలేకుండెను. కాకగృధ్రములు పృథ్వీ రాజును మృతునిగా భావించి యాతని మేనిమాంసము తిను టకై నలువైపుల నెగురుచుండెను. ప్రభుని యా విషమస్థితికిఁ దత్తరపాటుచెంది సంయమరాయలు రక్షణోపాయము లాలో చించుచుండెను. కాని తొడలు విఱిగిన యాతఁడు రాజు నెట్లు సమీపింపఁగలఁడు? ఏరీతిని రక్షణసేయఁగలఁడు? తుద కతనికొక యుపాయము పొడగట్టెను. చెంతనే యున్న యొకతరవారిని గైకొని తన శరీరమునుండి మాంసఖండములఁ గోసికోసి పక్షు లకు విందొనర్పసాగెను. ఈవిధముగఁ బృథ్వీరాజు విహంగముల బారినుండి తప్పింపఁబడెను. ప్రభుని రక్షణమునకు సంయమ రాయ లానందపరవశుఁడయ్యెను.

కొంతసేపటికి పృథ్వీరాజు మూర్ఛ తేఱిచూడఁగా ఆ కరు ణాదృశ్య మతనికంటఁబడెను. హృదయము గద్గదితమయ్యెను. కనులనుండి ప్రేమాశ్రువులు పొంగి పొరలెను. ధన్యవాదము లర్పించుట కతనిహృదయము తొట్రువడుచుండెను. కాని పెద వులు తెరవకమున్నే పాపమాతఁడు మరల విగత స్మృతుఁ డయ్యెను. సంయమరాయలు మాత్రము తనశరీరమును ఖండఖండములుగాఁ జేసి పక్షుల కానందము గూర్చుచునే యుండెను.

ఇంతలో పృథ్వీరాజు నాస్థానకవియగు చందుడు రాజు

నన్వేషించుచు వచ్చి సంయమరాయల సమీపించెను. సంయమరాయ లొనర్చుచున్న అమానుషకార్యమునకు విస్మితుఁడై "మిత్రమా! ఇంతసాహసమున కేల ఒడిఁగట్టితి" వనెను. అంతట సంయమరాయ లిట్లు సమాధానము చెప్పెను. 'ఏలిక యుప్పుతిని పెరిగిన యొడలిది. నేఁడాతని సౌకర్యమున కది విని యోగింపఁబడుచున్నది. ఇం దాశ్చర్యమేమున్నది. ఉచిత సమయమున ప్రభుని సేవించు భాగ్యము తటస్థించుట నాయదృష్టము. నాజన్మ ధన్యమైనది. ఇఁక నాతనిరక్షించుభారము నీది.'

ఇట్లు వచించుచుండఁగనే సంయమరాయలకు స్మృతి తప్పిపోయెను. కొలదికాలములోనే యాతఁడు తుదినిట్టూర్పు వదలి యీలోకము బాసి చనియెను.

అకుంఠితమైన యాతని రాజభక్తికి అచ్చెరువొందని వా రెవరు? హృదయము జలదరింపఁజేయు నాతని వీరచరిత్ర యద్వితీయ మనుటకు సంశయముగలదా?



# అచ్చమాంబ

*
* *

అచ్చమాంబ యాంధ్రదేశమునకు వన్నె తెచ్చినవనితా రత్నములలో నొకర్తె. ఆమెతండ్రి యొకానొక సంస్థానములో అమాత్యుఁడుగాఁ బనిచేసియుండెను. అంతటి యున్నతునియింట జన్మించినను ఆసతీమతల్లి కెల్లప్పుడును దీనుల పైననే దృష్టి. పరోపకృతి యామె జీవితపరమావధి.

ఒకనాఁడామె తన భర్తతో నెచ్చటకో పోవుచుండఁగా దారిలో నొకధర్మశాలయొద్ద నొకయార్తనాదము వినవచ్చెను. అదేమో చూతమని యామె సత్రములోనికి వెళ్లెను. వసివాడిన ముఖముతో మాసిన వసనముతో ఎలుగెత్తి యేడ్చుచున్న యొక యబల ఆమెకంటఁబడెను. ఆమెను చూచీచూడఁగనే అచ్చమాంబ హృదయము ద్రవీభూతమైనది. ఆమెచెంతఁజేరి "ఏమమ్మా! ఇట్లేడ్చుచున్నావు కారణమేమి?" యని ప్రేమ

తోఁ బ్రశ్నించెను. అంతట "నామె తల్లీ! నాకిపుడు తొమ్మిదవ మాసము. గర్భభారముచే కూలికిఁ బోవుటకుగాని అన్నమడిగి తెచ్చికొనుటకుగాని యోపిక లేకున్నది. ఆకలిబాధచేఁ గడుపు దహించుకొని పోవుచున్నది. కాని యాలించువా రెవ్వరు? పాలించువారెవ్వరు? దైవగతి యెట్లున్నదో తెలియ" దని విలపించెను

దయామూర్తియైన అచ్చమాంబ వెంటనే చేత నాల్గు రూకలు పుచ్చుకొని "సోదరీ! ఈపైకము తీసికొని యీకష్ట కాల మెటులో గడుపుకొనుము. కలకాలము కష్టము లిలు కట్టుకొని యుండవుగదా! ఈశ్వరానుగ్రహముచే సుఖప్రసూతి నంది కొలదికాలములోనే యీ కష్టసాగరమును దాటఁగలవు. ఇఁక నే పోయెదను" అనెను.

ఇంతలో నామెకు ప్రసవవేదన యారంభమైనది. ఆమె వారలెవ్వరును ఆమెచెంత లేరు. దీనాతిదీనయై సత్రములోఁ దలఁదాచుకొనుచున్న యాభాగ్యహీనకు మంత్రసాని యెక్కడ నుండి రాగలదు? అచ్చమాంబయే యభిమానము వదలి ఆమెకు సావికయయ్యెను. నిజసోదరికివలె ఆమెకుఁ బ్రేమతోఁ బురుడుపోసి యానాల్గు దినము లచటనే యుండి యనంతర మామె స్వగృహము చేరెను.

ప్రియపాఠకా !, ఆరీతిని అన్యుల కష్టసుఖములయందు బాల్గొను ఉదారస్వాంతులు మనలో లెక్కకు మిక్కిలితక్కువ. అందుచేతనే మన తెనుగుతల్లి కీ కంటతడి. అహంకృతియు అభిమానమును మనల నొడిసిపట్టియున్నంతవర కీ తడియారదు. పరహితమును గోరని నీప్రాభవమంతయు వ్యర్థమని నమ్ముము. నీవు నీసర్వస్వమును నిస్సహాయులకై వినియోగింప సంసిద్ధుడవై యున్నపుడే నీజీవితము చరితార్థము కాగలదు. అచ్చమాంబ జీవితమును తేజోవంతముగను స్మరణీయముగను జేసిన దామెదీనహితాభిలాషయేకాని యైశ్వర్యముగాదు. కులీనతయుఁ గాదు.



# ఈశ్వరచంద్ర విద్యాసాగరుఁడు

* *
*

ఈశ్వరచంద్ర విద్యాసాగరుని పేరు ఒకతూరి విని యుంటివిగదా! నిజముగ నతఁడు విద్యాసాగరుఁడే. అతడు తన దేశసోదరులకుఁ జేసిన సేవ యపారము. అతని తలంపులలోను మాటలలోను జేష్టలలోను ఇతరులు నేర్వఁదగిన విశేష మే దియో తప్పక యుండెడిది.

ఒకనాఁ డతఁడు "బర్ద్వాన్" అను నగరమునకు వెళ్లెను. రైలునుండి యతనితోఁ బాటు మఱియొకఁడుకూడ దిగెను. అతఁడు యువకుఁడు. చక్కని దుస్తులు ధరించియుండెను. చేతిలో నొక చిన్నిపెట్టెమాత్రము గలదు. అది యాతఁడు మోయఁదగినంత బరువునుగూడఁ గలిగియుండదు. కాని దాని నింటికి మోసికొనిపోవుటకై యతఁడు లజ్జించుచుండెను. కూలి వానికొఱ కటునిటుఁ గలయఁజూచెను. కాని పెద్దపట్టణము కాక

పోవుటచే కూలిమనుష్యు లెవ్వరు నచ్చట వేచియుండలేదు. తుదకు అతనికే మోయక తప్పినదికాదు.

స్టేషనునుండి బయలుదేరినాఁడు. కాని అడుగులు తడఁబడుచున్నవి. ఏదో అసురకృత్యముచేయ సంకల్పించిన వానివలె బెదరిబెదరి నలుఁగడల దృష్టి నిగుడించుచుండెను. ఒడలంతయు ముచ్చెమటలు బోసినవి. వెన్నుఁజఱచి "ఇట్టి యల్పపుఁబనికిఁ బాల్పడితివే"మని యెవఁడో మందలించుచున్నట్లు మాటిమాటికి యులికిపడి వెన్కకుదిరిగి చూచుచుండెను.

ఇంతలో వయసుజాఱిన వృద్ధుఁడొకఁడు ఆ యువకుని సమీపించి " పెట్టె నాకిండు, నేఁగొనితెచ్చెద "ననియెను. యువకుని యాందోళనయంతయు నొక్కమారు శమించినది. మారుమాటాడక పెట్టె యతనిచేతి కిచ్చి సగర్వముగ ముందు నడువసాగెను. వృద్ధుఁ డాతని యింటిదాక పెట్టెను మోసికొనివెళ్లి యిచ్చి తన దారిని వెడలిపోయెను.

ఆ దినముననే సాయంసమయమున ఆ నగరములో నొక పెద్ద సభ జరిగెను. ఆ సభకు విద్యాసాగరుఁ డధిపతి. ఆ మహామహుని దర్శించి యాతని యమృతవాక్కులు వినుటకై వేనకువేలు జను లేతెంచితిరి. ఆ యువకుఁడును సభలోఁ బాల్గొనుటకే వచ్చియుండెను. సభాసమయమున కచ్చటికి వచ్చి విద్యాసాగరుని వీక్షించి శిలాప్రతిమవలె మాన్పడి

యుండెను. అతనిపై నొకపిడుగు పడినట్లయినది. ఉదయమాతని పెట్టె మోసికొనివచ్చిన దీ విద్యాసాగరుఁడే !

సభ ముగిసినవెనుక ఆ యువకుఁడు విద్యాసాగరుని యింటికేగి పాదములపై వ్రాలి తన యజ్ఞానమును మన్నింపు మని వేడుకొనెను.

విద్యార్థీ ! యువకుని వెఱ్ఱియూహలును విద్యాసాగరుని విశాల వర్తనమును నీ కనులకు ఎట్లు పొడఁగట్టుచున్నవి? నీవు ప్రపంచమున గొప్ప వాఁడవు కాదలచినచో ఉత్తమ కార్యములు చేయుటకన్న వేఱుమార్గములేదు. సుందరములగు నుడుపులు ధరించుట, చందనాదులచే శరీర మలంకరించుకొనుట, కురులు దువ్వుకొనుట, పూలు ముడిచికొనుట- ఇవి యెన్నటికిని నీ ప్రతిష్ఠకుఁ గారణములుకావు. సద్గుణములే నీకు యశస్సు చేకూర్చఁగల సాధనములు. బాహిరమైన నీ కృత్రిమవేషమునుజూచి ప్రపంచము నిన్నెన్నఁడు గౌరవించదు. అభిమానమువదలి నీ పనులను నీవు స్వయముగాఁ జేసికొనుటకే నీవు సిగ్గిలినచో నీవీ ప్రపంచమునఁ జేయఁగల ఘనకార్యములింకేమిగలవు? దురభిమానమను పిశాచమును దరిజేరనీయకుము. నీ జీవిత మప్పు డెంతో సుఖవంతముగ నుండును.



# హాంగీరు

* *

జహాంగీరుచక్రవర్తి మిగులన్యాయప్రియుఁడు. విపన్నుల కన్ని వేళలయందును దర్శనమిచ్చి న్యాయవిచారణ చేసెడి వాఁడు. అతని కోటతలవాకిలియొద్ద నొకగంట కట్టఁబడియుం డును. చక్రవర్తిదర్శన మభిలషించిన వాఁ డెవఁడైనను ఏవేళ నైనను దానిని మ్రోఁగించవచ్చును. నడికిరేయాగాక అతఁ డా మ్రోఁతవిని న్యాయము విచారించి పంపెడివాఁడు. ప్రజారంజ కుఁడైన యట్టిప్రభువే ప్రభువు. స్వర్గము నతకరించెడువాని రాజ్యమే రాజ్యము.

ఒకనాఁ డతఁడు నిండోలగమున నుండఁగా ఘంటా రావము కర్ణపుటమును జొచ్చెను. వెంటనే యాతఁడు సభాకార్య మునిలిపి గంటమ్రోఁగించినవానిని లోనికిఁ దోడ్తేరఁబంపెను. ఒక చాకిత గుండియలవియ నేడ్చుచువచ్చి యిట్లు మొరపెట్టు

కొనెను. "ప్రభూ! నాభర్తయు నేనును యమునానదిలో బట్టల నుదికికొనుచుండఁగాఁ దమకోటవైపునుండి యొక తుపాకి గుండువచ్చి నాభర్తకుఁ దగిలినది. వెంటనే యాతఁడు విగతజీవుఁడయ్యెను. దేవరవారీ యనాథకు న్యాయముకల్పింప వలెను."

జహాంగీరు ఖిన్నుఁడై యక్లేయని 'వాయిదా' వేసెను. ఆ ఘాతుకకృత్యము చేసినదెవ్వరో జాడలు దీయుటకై రహస్యముగ యత్నించెను. తనప్రియురాలగు నూర్జహాన్ వినోదార్థము తుపాకిప్రేల్చెననియు అదియే మడివేలుమృతికిఁ గారణమయ్యెననియు దెలియవచ్చెను.

'వాయిదా' వేళకు చ్రకవర్తి మంత్రులతోను సామంతులతోను సభదీరిచి యుండెను. తనదీనదృష్టుల రాజుముఖముపై నిలిపి రజకి యొకవైపున నిలుచుండియుండెను. సభలోనివారందఱు చక్రవర్తి యిపుడేమిన్యాయము చెప్పునోయని యెదురు చూచుచుండిరి. జహాంగీరొక దట్టించిన తుపాకీని దెప్పించి చాకలిదానిచేతి కిచ్చి యిట్లనెను. "ఓసీ! నూర్జహాన్ నీభర్తను జంపి నిన్ను విధవను జేసినది. అట్లే నీవును ఈతుపాకీని బ్రేఁల్చి యామెభర్తనగు నన్ను జంపివేయుము. ఆమెయు నీవలెనే యనాథ కాగలదు."

చాకిత యంతసాహసమున కొండిగట్టఁగలదా! అది యట్లు సేయ నిరాకరించినది. జహంగీరప్పుడామెకు నొక జాగీరు ఇచ్చెను. అది నేఁటికిని ఆమెసంతతివారి యధీనములోనే యున్నదఁట.

బాలకా! చూచితివా! న్యాయపాలనమున ఆచక్రవర్తికిఁ గల గాఢానురాగము! తనయెడ తలలో నాలుకవలెఁ బ్రవర్తించుచుఁ దనసౌఖ్యములకెల్ల నేకైకకారణమైన తనయర్ధాంగినిఁ దన ప్రేమంపుటిల్లాలిని సైతము న్యాయముమ్రోల తృణముగా భావింపఁగలిగిన యాతని సమబుద్ధి కొనియాడఁ దగినదికాదా! జీవనవికాసము కోరు ప్రతిమానవుఁడును అట్టి శక్తిని సంపాదించుటకే ప్రయత్నము చేయవలెను. న్యాయదేవతయెదుట ఎట్టివస్తువునైన బలివెట్ట సంసిద్ధుఁడగువాని జీవితమే జీవితము. అట్టివానికే యీప్రపంచమంతయుఁ బాదాక్రాంతము కాఁగలదు.



# స్వధర్మము

* *
*

భారతదేశము మహాప్రవక్తలకుఁ బుట్టినిల్లు. ఒక్కొక ప్రవక్త జనించి యొక్కొకమతమును వెలయించినాఁడు. గురు నానకు సిక్కుమతస్థాపకుఁడు. సిక్కులకుస్వమతముపైఁగల యభిమానము వర్ణింపనలవికానిది. మతాభిమానము, స్వాతంత్ర్య ప్రియత, శౌర్యసంపత్తి వారికి ఉగ్గుతోఁ బెట్టినగుణములు.

గోవిందసింహుఁడు వారి పదియవగురువు. అతఁడు మహా పరాక్రమశాలి. తనమతమును గాపాడుటకై యనేకపర్యాయములు కదనరంగమున నెత్తురోడ్చిన వీరసింహుఁడు. స్వధర్మమునకై చచ్చుటయే మేలుకాని పరధర్మము స్వీకరించుట పాడిగాదని లోకమునకుఁ జాటిన మతాభిమాని. అతనికొడుకు లిర్వురును చిన్నతనముననే సర్వలక్షణసంపన్నులై అన్నివిష

యములందును దండిని మఱపింపఁజాలియుండిరి. ఔను! సింహముకడుపున సింహశాబకములే జనించునుగదా!

ఒకప్పుడు సిక్కులకును మహమ్మదీయులకును మహా సంగ్రామము జరిగెను. గోవిందసింహుఁడు తుదిదాక వీరవిహారము జేసి రణస్థలియందే యసువులువాసెను. అతనికుమారు లిరువురు శత్రుసైనికులచేఁ జిక్కిరి. సైనికులు ఆ వీరకుమారులను బాదుషాయొద్దకు తీసికొనివెళ్లిరి. పాదుషా యిట్లనియె. 'బాలకులారా! వైరులఁజెండాడుటయనఁజెండాటయనుకొంటిరా? పసవలపు వదలని మీచిఱుతవయ స్సెక్కడ? ఈ సంగరక్రీడ లెక్కడ? అదృష్టవంతులు కావుననే బ్రతికి బయటఁబడితిరి. పవిత్రమైన మాయిస్లాముమతమును పరిగ్రహింపుడు. మీకు రవంతయైన వంతగలుగదు. మీకు మీకోరినరాజ్యభోగములు లభింపఁగలవు.

ఆమాటలు విని బాలకులు సాభిమానముగ "అయ్యా! నిజధర్మమునకు నీళ్లు విడిచినవెనుక రాజ్య మెందుకు? పదవు లెందుకు? నీటిబుగ్గవలె నిల్కడలేని ఇహసౌఖ్యముకంటె శాశ్వతసుఖమిచ్చు స్వధర్మమే మాకుఁ బాటింపఁ దగినది. తుచ్ఛములగు మాప్రాణములైన మీకత్తికి ఎరగా నిచ్చెదముగాని మాధర్మముమాత్రము మేము విడిచిపెట్టము" అని పల్కిరి. పాదుషా కోపావేశపరవశుఁడై బెదరించి చూచెను.

కాని వారు చలింపక మీారు మీామతమును "ప్రేమింపవచ్చును గాని అన్యమతములను అపమార్గము పట్టింప యత్నించుట యేటిన్యాయము? మీాకిన్కం గలంతం జెందము. మీాలాలనకు లొంగము" అనిఁనిర్భయముగా జెప్పిరి. పాదుషా వారిమత విశ్వాసము గాంచి చకితుఁడయ్యెను.

పాఠకా! అల్పలాభములకై మతధర్మముల నంగడివెట్టి జాతికంతకు అవనతి కల్పించు అభాగ్యులకును ఈవీరకుమారు లకును సాదృశ్యము కలదా! లేదు. వయసునఁ బిన్నలైనను జ్ఞానమున వృద్ధు లా బాలకులు. కావుననే వారి పవిత్రినామ ములు చరిత్రిలో బంగారుఅక్కరములఁ బరిఢవిల్లుచున్నవి. అట్లేనీవును నీమతమందు సంపూర్ణవిశ్వాసముగల్గియుండవలెను. మేరువు నీకు చేరువగుఁగాక. మృత్యువు నీమోౖల నృత్యము స ల్పుఁగాక. వ్యామోహమునొందఁగూడదు. భీతిచెందఁగూడదు. స్వధర్మము నెరవేర్చుటయందే నిరతాసక్తి గల్గియుండవలెను. పరమతము నాశ్రయించి నూతేండ్లు మనుటకంటె స్వమతాధి కారమున జీవించు ఒకనిముసమైనను నీకు చిరకీర్తిని గడించ గలదు. కాన స్వధర్మరక్షణమే నీజీవితపరమావధి యని విశ్వ సించుము.



# మాతృభక్తి

* *
*

నెపోలియను ఐరోపాఖండమునంతను గజగజలాడించిన వీరచక్రవర్తి. నాఁడును నేఁడును అతనికెనయైన శూరుఁడు ప్రపంచములో జనించియుండలేదు. పరాక్రమ మతనియందు మూర్తీభవించినది. ఉదారత యతనికిఁ బెట్టనిసొమ్ము.

ఒకప్పు డొక ఆంగ్లసైనికుఁ డతనిచే బంధింపఁబడెను. పాపము! ఆసిపాయి తనతల్లి కొక్కఁడే పుత్రుఁడు. అతనికి ఆమె పై మితిలేనిభక్తి. ఆమెకును అతనియందపారమైనవాత్సల్యము. ఇఁక నొకరినొకరు విడిచియుండుట దుర్లభముగదా! తలవని తలంపుగాఁ గల్గిన యెడఁబాటుచే నతఁడు కృశించిపోవుచుం డెను. కాని మార్గమేది? తానున్నది పరాసుదేశములో దుర్భేద్యమైన కారాగృహమందు; తనతల్లియున్నది సముద్రమున కవ్వల ఇంగ్లండుదేశమందు. కారాగారమునుండి తప్పించు కొనుటెట్లు? అపారావారమును దాటుటెట్లు? కాని దృఢసంకల్పము దారిచూపకపోదు. కావలివారు కనుమూసినప్పుడు

గవాక్షము పెకలించి యతఁడు వెలికురికినాఁడు. తెల్లవాఱక మునుపే సముద్రతీరముచేరి తరుణోపాయ మాలోచించుచున్నాడు. కాని దురదృష్టవశమున జయిలుఅధికారులు వెంటాడి వచ్చిరి ఆసైనికుని యాశలన్నియు నడుగంటినవి. అధికారులతని రెక్కలుగట్టి నెపోలియన్ సమక్షమునకుఁ దీసికొనివచ్చిరి.

అతఁడు తనదీనవృత్తాంతము నెపోలియన్ చక్రవర్తికి విన్నవించుకొనెను. ప్రాణములపైఁగలతీపిచేఁగాక తల్లికి ఆనందమును గూర్చులాలసతో ఆసైనికుఁడొనరించిన సాహసకృత్యము చక్రవర్తిహృదయము కరగించివైచినది. వెంటనే యాతనిమన్నించి యతని జననియొద్దకుఁ బంపివేసెను.

పాఠకా! చూచితివా! మాతృభక్తి యాసైనికు నెట్టి సాహసకార్యమునకు ప్రేరించినదో! ఆతఁడైనను తనయందట్టియద్భుతశక్తు లిమిడియుండెనని యెఱుంగకపోవచ్చును. కాని తల్లియందుఁగల గాఢానురాగము ఆగుప్తశక్తుల రేకెత్తించినది. ఆత్మార్పణమునకు నడుము గట్టించినది. తల్లిమ్రోలఁ దక్కినప్రపంచమంతయుఁ గడ్డిపోచవలెఁ గన్పడినది. శాత్రవుని హృదయసీమను ఔదార్యవాహినిఁ బ్రహింపఁజేసినది. మాతృభక్తియొక్క మాధుర్యము నెవరు వర్ణింపఁగలరు? కావున నెన్నియిక్కట్టులందైనను మాతృభక్తిని విడనాడకుము. నిన్ను నవమాసములు మోసి కని పెంచి నిన్నే తనసర్వస్వముగాఁ భావించు నీ తల్లికంటె నీకుఁ బూజ్యవస్తువు వేఱు లేదని గ్రహింపుము.

# ఛత్రపతి శివాజీ

* *
*

పాఠకా ! నీవు శివాజీచక్రవర్తియొక్క పవిత్రనామ
మును వినియుందువు. అతనిచరిత్రనుగూడ పఠించియుందువు.
అతఁడు సాధారణమానవుఁడు కాఁడు. పెరమతముల యా
క్రాంతిచేఁ గఱకుతగ్గుచున్న హిందూమతమును ఉద్ధ
రించుటకై యవతరించిన మహానుభావుఁడు. చిన్ననాఁడు గురు
వులుచెప్పిన హితవులను మన్నించి దృఢసంకల్పముతో
స్వతంత్రరాజ్యస్థాపనగావించి తన కీర్తిచంద్రికలను దిగంత
ముల కంపిన ధీరుఁడు. భారతజనని కతఁడు నోములపంట.
భారతజాతి కతఁ డాదర్శపాత్రుఁడు.

రత్నములన్నియు సాగరమును జేరినట్లు గుణరత్నము
లన్నియు వాని నాశ్రయించినవి. అతఁడు పరకాంతలఁ బలుక
రించి యెఱుఁగఁడు. పరులమనస్సు నొవ్వనాడుట యేమో
అతనికిఁ దెలియదు. పరమతద్వేషము మూర్ఖలక్షణమని
యాతనివిశ్వాసము. ఒకప్పుడు మహమ్మదీయులమతగ్రంథ
మగు "కురాన్" అతని చేఁజిక్కినది. అతఁడు పూజ్యభావముతో
దానిని గనుల కద్దుకొని పల్లకీయం దునిచి తిరిగి పాదుషా

యొద్దకుఁ బంపివేసెను. మఱియొకతూరి ఆతనిసైనికులు మహమ్మదీయవనితనొకర్తెను యుద్ధములోఁ జెఱవెట్టితెచ్చిరి. ఆ నీచకార్యముగాంచి శివాజీయొడలు మండిపోయినది. తనువు కంపమందినది. ఆ సైనికుల నదల్చి ఆమెను గన్నకుమార్తెవలె సన్మానించి "మాతల్లికి నీ సౌందర్యమున్న యెడల నెంత బాగుండెడిది! నేనెంత యదృష్టవంతుఁడనై యుండెడివాఁడను! ఎంత సౌందర్యవంతుఁడ నయ్యెడివాఁడను!" అని క్షమాపూర్వకముగ నా కాంతను ఆమె భర్తకడ కంపివేసెను.

బాలకా! అతనిహృదయ మెంత విశాలమైనదో ఆలోచించుము. క్షత్రధర్మమునననుసరించి మహమ్మదీయులపై వైమనస్యము కల్గియున్నను, ఆతఁడు వారిమతమును ఎన్నడు నిరసించియెఱుఁగడు. ఆ మహామహునియందున్న గొప్ప తన మదియే. మతద్వేషముతో మండిపోవుచున్న దేశమునకును జాతికిని ముక్తి లేదని గ్రహింపుము. వాహినులన్నియు సాగరమును జేరునట్లే మతములన్నియు సర్వేశ్వరునియొద్దకుఁ గొంపోవు సాధనాంతరములే. నీమతమందున్న సుగుణములే యన్యమతములందును గలవని భావింపుము. మనకు గమ్యమొకటియై యున్నపుడు నీ వొకమార్గమునను నే నొకమార్గమున బోయిన హాని యేమిగలదు? అంతమాత్రమునకు మనకు విరోధ మేల కలుగవలెను? మతస్థాపకులైన పవిత్రులందఱు లోకేశునిచేఁ బంపఁబడినవారే. భిన్నరుచులచే మతమునకు భిన్నరూపము లేర్పడినను వానిలో నిగూఢముగా నున్న పరమార్థ మొక్కటే. అది సాధించుటే నీధ్యేయము. అదియే నీవు ప్రాపింపఁదగినది.



# స్వామి సత్యదేవుఁడు

* *

బాలకా! నీవు సత్యదేవుని పేరు వినియుండవు. అతనిది ఉత్తరభారత దేశము. మాతృదేశమునకై సర్వము ధారవోసి సన్యసించిన మహానుభావుఁడు. సన్యసించినను దేశము నుద్ధరించుటయే యతనిలక్ష్యము. జాతిని పౌరుషవంతము సేయుటయే యతనిసంకల్పము.

అతఁ డొకనాఁడు రైలులోఁ బ్రయాణముచేయుచుండెను. అతనిప్రక్కనే యొక బంగాళీయువకుండు కూర్చుండెను. వానిది దుర్బలశరీరము. యువకుఁడే కాని ముఖమున కళ లేదు. కనులయం దుత్సాహ రేఖలు తొలుకాడుటలేదు.

ఒకచోట నావిరిగబండి యాగినది. యువకుఁడు తాను కూర్చున్నచోట గురుతుకుఁ దనటోపీనుంచి దాహము తీర్చికొనుటకై క్రిందకు దిగెను. ఇంతలో ఆజానుబాహువు దృఢ

కాయుఁడునగు పఠానొకఁడు తటాలున లోనికిఁ బ్రవేశించి ఆయువకుని స్థానమాక్రమించుకొనెను. యువకుఁడు తిరిగి వచ్చెను గాని యేమిచేయఁగలఁడు? బలశాలియైన ఆపఠాను నెట్లు లేవఁగొట్టగలఁడు? హతాశుఁడై యొకమూల నొదిగి నిలుచుండెను. పఠానుపరుషవర్తనమును యువకునినిస్సహాయత్వమును జూచుచున్న సత్యదేవునకు హృదయము మండిపోయినది. అతఁడు కోపము ఆపుకొనలేక పఠానుతో నిట్లనియె

సత్య:-- ఓయీ! నీవు కూర్చున్న చోటు ఆయువకునిది. అతఁడు క్రిందికి దిగినసమయమున నీవు దౌర్జన్యముగా నాస్థాన మాక్రమించుకొనుట యక్రమము.

పఠా:—ఓహో! నీవునాకు హితము చెప్పవచ్చితివా? రైలులో నొకని-చోటేమి? నాయిచ్ఛవచ్చిన తావునఁ గూర్చుంటిని. అట్లుకాక యక్రమముగాఁ గూర్చున్ననునీవేమి జేయఁగలవు?

సత్యదేవుడు సరోషముగా "ఏదీ! నే లేచెదను. నాచోట గూర్చుండుము. నీపాట్లేమగునో తెలియు" నని లేచెను. మదోన్మత్తుఁడై యున్న యాపఠాను తలపంకించి యాతల మాక్రమించుకొనెను సత్యదేవుఁడు వెంటనే యాతనిఁ గ్రిందికిలాగి ముష్టిఘాతములచే ముంజెరమలలోనికి నెత్తురు వచ్చునటులఁ గొట్టెను. సత్యదేవుఁడు మిగుల బలాఢ్యుఁడు. అతనిముందు

పఠాను ఆటలు సాగలేదు. తుదకతఁడు వినముౖడై "స్వామీ! మీకింత యాగ్రహము తగునా" యనెను. ఈ దృశ్యముగాంచు చున్న ఆయువకునిముఖ మపుడు విప్పారెను. అతఁడు పరి హాసముగ "ఔనోయీ! వారు స్వాములే! అయిననేమి? మాటచే వినని యప్పుడు కాలిచేనైన వినిపింపఁగల సమర్థులు" అనెను.

పాఠకా! ఇది కేవలము విని వినోదింపఁదగినవిషయము కాదు. నీవు ఈ సంఘటనముపై దీర్ఘాలోచన చేయవలెను. నిర్వీర్యమగు జాతికి నిలువ నీడయే లేదనినీవు గ్రహింపవలెను. ఈయుగములో దుడ్డెవ్వనిచేత నుండునో గొడ్డు వానిదే. బలహీనునకు మానవసహజమగుహక్కులుగూడ నుండవు. దృఢతారహితమై యున్నజాతి యున్నను లేనివానిలోనే లెక్క. అందుచే నేఁటినుండియే నీబలపౌరుషముల నభివృద్ధిచేసికొనుము. నీజీవితము ప్రమోదభరితమై యుండఁగలదు. నీజాతి గౌర వాన్వితమై వెలయఁగలదు.



# వీర కుమారులు

* * *

పెక్కువత్సరము లైనది. పరమత విద్వేషియగు నొక మొగలాయిచక్రవర్తి మన దేశమును పాలించుచుండెను. గాఢమగు స్వమతాభిమానముచే అతఁడు తన రాజ్యములోని యన్యమతములవారిని మిక్కుటమగు కష్టములపాలు సేయుచుండెను. ఆతని కెదురాడువారెవ్వరును లేకుండిరి. ఆతఁ డెవని నెన్ని బాధలుపెట్టినను కిక్కురుమనకుండ సహించి యూరకుండవలసినదే.

ఆతడుపెట్టుబాధ లనుభవింపలేక యొకవేళ నెవ్వఁడైన రాజ్యము వదలి పోఁదలఁచినను సాధ్యముకాకుండెను. తన రాజ్యపుసరిహద్దులు దాటి యన్యమతస్థు లెవ్వరును వెలుపలికి బోరాదని యాతఁడు కఠినముగా శాసించెను. ఇఁక వారి మనస్సంకటమునకు మేరయుండదుగదా! రహస్యముగా రాజ్యపు

ల్లలు దాటిపోదురేమోయని సరిహద్దుల నాతఁడు సాయుధు లైన భటులను గాఁపువెట్టెను.

ఎట్టులైనను ఆదురాత్మునిబారినుండి తప్పించికొనవలె నని యొక కుటుంబమువారు సంకల్పించుకొనిరి. వారికి ఇరు వురుపసిపాప లుండిరి. ఆపసి గందుల నెవ్వరికంటను బడనీయక రాజ్యముదాటి పోవు టెట్టు లాయనివారు వనటనొందసాగిరి. వారు పసికూనల నొకతట్టలో నడుగుభాగమం దుంచి పైని కూరగాయల నించి విక్రయింపఁబోవునెపమున బయనమైరి. రాజ్యపుసరిహద్దులఁ జేరునప్పటికి అచటిరక్షకభటు లడ్డుతగిలి "మీ రెచ్చటికిఁ బోవుచున్నా" రని ప్రశ్నించిరి. "అయ్యలారా! మేము పై గ్రామములో నీకూరఁగా యల నమ్ముకొనఁ బోవుచున్నా"మని వారు ప్రత్యుత్తరమిడిరి. అయినను సంశయము వీడక వారాతట్టలోఁ గత్తివెట్టి పొడిచి చూచిరి. పైకిఁ బెకలించిచూడ వారికరవాలములు శోణి తారుణములై కన్పట్టెను. అపుడు వారు విస్మయమంది దానికిఁగలకారణమును దెలియఁగోరిరి. అంతనాబిడ్డల జననీ జనకులు ఇట్లుచెప్పిరి. "అయ్యా! తట్టలో నడుగుభాగమున ముల్లంగిదుంప లున్నవి. అవిసహజముగా అరుణములు. అందుచే వానిరక్తిమయే మీఖడ్గములకంటుకొన్నది. గాని వేఱే మియు లేదు". భటులు ఆమాటల విశ్వసించి వెడలిపోయిరి.

కాని బిడ్డలకేమిముప్పు ఘటించెనోయని తలిదండ్రుల హృదయములు తల్లడ మందఁజొచ్చెను. సురక్షితమైన యొక

ప్రదేశమును జేరినవెన్క వా రాతురతతోఁ దట్టను దింపి యం దలిపసి బిడ్డలను బయటకుఁదీసిరి. నెమ్మోగముల చిఱునవ్వు లొలయ ఆబాలకులు ముద్దుపలుకులతోఁ దలిదండ్రులతో నిట్లనిరి.

ఒకఁడు:— నాయనా! కత్తిపోటునకు నావేళ్లు తెగిపోయినది. అయిననేమి? నే నించుకయుఁ జలింపక దాగియుంటిని. వన్నాసిపాయి కనుగొన లేకపోయెను చూచితివా?

రెండవవాఁడు:—అమ్మా! నాకును గత్తి దూసికొనిపోయినది. ఇదిగో చూడుము. రక్తము స్రవించుచున్నది. ఏమాత్రము కదలినను భటులు పసివట్టుదురని - బిగబట్టుకొని పడుండి యుంటిని. తలిదండ్రులు వారిధైర్యస్థైర్యముల గాంచి మేర మీరిన సంతోషముతోఁ బరవశత్వమునొందిరి.

బాలకా! గడ్డకట్టిన యాముద్దుబిడ్డల ధైర్యమునకు నీవు అక్కజపడుటలేదా? అట్టివీరకుమారులఁగన్న తలిదండ్రుల సుకృతమే సుకృతము. కత్తిపోటుల కేని కలఁతచెందక అతిమాత్ర సాహముచూపిన యాబాలకులను నీ వెన్నడును విస్మరింపకుము.



# చదువునకు ఫలము

* *
*

ద్రోణుఁడు కౌరవపాండవుల గురువు. ఒకనాఁడు వారికి ఆయన ఈ క్రిందిపాఠ మిచ్చెను:

"సత్యము పలుకుము"
"కోపము పనికిరాదు"

చాల చిన్న పాఠమిచ్చిరని శిష్యులందఱు సంతోషముచే నుప్పొంగిపోయిరి. కొందఱప్పుడే కంఠస్థము చేసివేసిరి. కాని ధర్మరాజుఁడుమాత్రి మిట్లు సమాలోచనముచేయ మొదలిడెను. "ఏమీ! సత్యము పలుకవలెనా! సత్యముపలికినచో నొకప్పుడు ధనహాని కలుగవచ్చును; మానహాని కలుగవచ్చును; ప్రాణహానియుఁ దటస్థింపవచ్చును. అట్టి విషమ పరిస్థితులందును సూనృతమే వచింపవలెనా? ఔను, గురువుగారిచ్చినపాఠమును బట్టి సత్యము పలుకుట యనివార్యమే. కాన ఇడుమ లెన్ని సంభవించినను సత్యపథమును వదలి చరింపరాదు. అపుడే యీ పాఠము వచ్చినట్లు భావింపవలెను.

ఇఁక రెండవపాఠము; "కోపము పనికిరాదు" ఇతరులు మనలను అహేతుకముగాఁ దిట్టెదరు; కొట్టెదరు. అపుడును

గినఁ బఠింపఁగూడదా ! కూడదనియే యీ పాఠములోని యర్థము. అట్టినిగ్రహ ముందునో లేదో పరీక్షించి చూచుకొనవలెను. అంతదనుక నీపాఠము వచ్చినటు లెంచరాదు.

మరునాఁడు బడివేళకు విద్యార్థులందరును వచ్చిరి. ద్రోణాచార్యు లొకరొక్కరినే పిలిచి "పాఠము వచ్చినదా" యని యడిగెను. అందఱును వచ్చినదని తలలెగురవేసిరి, కాని ధర్మజుఁడు మాత్రము తన కింకను 'పాఠము రాలే' దనియెను. సహవిద్యార్థు లందఱు పకపకనవ్వి గేలిసేసిరి. ద్రోణుఁడు కను లెఱ్ఱఁజేసి గద్దించుచు 'పాఠమును ఏల వల్లించలే' దని కొట్టెను. కాని ధర్మజుఁడు చలింపలేదు. అతని ముఖమునఁ గోపర క్తిమ కానరాలేదు. ఎప్పటియట్ల శాంతరసము ఉట్టిపడుచునేయుండెను.

ద్రోణుఁ డప్పుడు గంభీరస్వనమున నిట్లు వాక్రుచ్చెను. "విద్యార్థులారా ! యుధిష్ఠిరున కొక్కనికేఁ దక్క మీకెవ్వరికిని పాఠమురాలేదు. 'సత్యము పల్కవలె' ననిగదా ! మొదటి పాఠము? సత్యముపల్క నవకాశము మీకు లభింపనిదే మీకా పాఠమెట్లు వచ్చినది? మొదటనే మీరు అసత్యము పల్కిరి. కాన మీ కాపాఠము రాలేదు. అట్లే కోపము నిగ్రహించుకొను శక్తి మీకుఁ గల్గినదో లేదో పరీక్షించుకొనువఱకు మీ కాపాఠము వచ్చినట్లు ఊహించరాదు. పాఠమురాలేదని ధర్మతనయుఁడు మొదటనే సత్యము వచించెను. అతనినే తీవ్రముగాఁ బ్రహరించినను అతనిముఖము కందనైనను గందలేదు. కాన అతని కొక్కనికే రెండుపాఠములును వచ్చినవి."

బాలకా! నీ వీకథలో నేర్వఁదగిన చక్కని నీతి గలదు. నీవు ధర్మసూత్రము లెన్ని పఠించినను ఆచరణము శూన్యమైనచో నేమియుఁ బ్రయోజన ముండదని గ్రహింపుము. నీవు నేర్చిన నీతుల ననుసరించి నీజీవితమును సరిదిద్దుకొనుచుండవలెను. చదువుకొన్నందుకు ఫలముగ నీనడవడియందు మార్పేమైన కలిగెనో లేదో నీ వెప్పటికప్పుడు పరీక్షించుకొనుచుండవలెను. లేనిచో నీవు చదివినది చదువు కానేరదు. శాస్త్రము లనేకములు పఠించియు వానికనురూపమైన యాచరణము నలవఱచుకొనని మానవుఁడు చందనమును మోయుచు దాని సౌరభమాస్వాదింపలేని గార్దభమువలెను, రుచికరములగు పదార్థములలో నిరంతరము తిరుగాడుచు వానిరుచి నరయలేనిదర్వివలెను వ్యర్థుఁడని సమ్మము. కాన సంస్కారమే చదువునకు ఫలము. నీ వీ పుస్తకములో నెన్నో నీతులను బఠించితివి. ఎందఱోమహాపురుషులతోడి పరిచయమును గలిగించుకొంటివి. ఇందుకుఁదగిన ఫలమును నీవు బొందినపుడే నీశ్రమ సార్థకమగును. అట్లుగాక యొకచెవితో విని మఱియొకచెవితో విడిచిపెట్టితివా, నీజీవితమున లేశమైన నభివృద్ధి గన్పట్టదు. నీవు పఠించెడి ప్రతివిషయముపైనను సమాలోచన చేసికొనవలెను. మనస్సునకు దానిని గట్టిగాఁ బట్టించుకొనవలెను. తదుపరి దానికనురూపముగ నీజీవితమును సంస్కరించుకొనవలెను. అపుడే భగవానుఁడు నీ కమేయకృపతోఁ బ్రసాదించిన యీ మానవజన్మము సర్వవిధముల సార్థకము కాఁగలదు.

